శ్రీరస్తు.

# వైశ్యవేశ్యవధ.

నాటక గ్రంథకర్త:

మరింగంటి నృసింహాచార్యులు.

ప్రకాశకుడు:

కాశీశాస్త్రి సూర్యప్రకాశరావు,

ప్రొప్రయిటరు

అంబికాబుక్కుడిపో,

రాజమండ్రి.

PRINTED AT
THE ALBERT POWER PRINTING WORKS,
COCANADA.
1927



[వెల రు 0—6—0.

శ్రీ రస్తు.

# వైద్యవేద్యపథం.



మాంగంటి వెంకట రాఘవాచార్య ద్వితీయపుత్రులగు

వెంకటనృసింహాచార్యులుగారిచే

రచింపబడినది.

ప్రకాశకులు:

కాళహస్తి సూర్యప్రకాశరావు,

రాజమండ్రి

కాకినాడ

ది ఆల్బర్టు పవర్ ప్రింటింగ్ వర్క్సునందు

జె. జగన్నాథ శాస్త్రిగారిచే ముద్రింపబడియె

1926.



[వెల 0-6-0

# పీఠిక.

ఓ సోదరులారా,

యీపుస్తకంబు మహారాజశ్రీ కాళహస్త్రి సూర్యప్రకాశ రావుచే ప్రోత్సాహితుడనై నవీన కథాకల్పనంబొనర్చి చదువరుల కింపుజాప కాలానుగుణంబుగా విటులు వేశ్యల గేహంబులకు జేరి వారు పొందుయిడుము లెల్లను తామెల్లరు వీక్షింపుచునే యుండురుక దా యింతకుమున్న కొంతమంది కవివరులట్టి కథలఁ గల్పించిరి గాని నా స్వాంతంబున యానంధం బొందియు నించుక కొరతయుంచి యట్టి కథ కల్పించి లిఖించితిగాన తామెల్లరు నిందుగల తప్పిదంబులెల్లను నిరీక్షించి క్షీరమిళితమైన నీరంబులఁ పరిత్యజించి, క్షీరంబులే గ్రహించు రాయంచల చందంబున తప్పిదంబుల నొప్పులుగా భావించ మిక్కిలి వేడుచున్నాడను. దీనియందనేక తప్పిదంబులున్న యెడల నాకెరింగించిన ద్వితీయముద్రణమున సవరించుకొనువాడను.

ఇట్లు.

విద్వజ్జనవిధేయుడు,

మరింగంటి వెంకటనృశింహాచార్యులు.

# అభిప్రాయము.

వేశ్యా ప్రియత్వము ఆధునికులలో నొక గౌరవముగా నెంచబడుచున్నది యువకులు తమలో తాము ప్రస్తావించుకొను మాటలు వినగలిగితిమేని దీనియందెంత గౌరవమున్నదో తెలియనగును. ఈ దుర్నీతి హిందూసంఘమునకు వేరు పురుగువలె పరిగణింప తగియున్నది. ముఖ్యముగా వైశ్యులలో ధనికులు చాలమంది కలిగి యుండుటచేతను విద్యలయందు వారికి అభిలాష మెండు కానందునను ప్రస్తుతము వైశ్యయువకులలో వేశ్యాపరాయణత్వము మెండుగా నున్నదని వ్రాయుటకు చింతిల్లుచున్నాము.

యీ చిన్నపుస్తకము అట్టి దురభ్యాసమును మాన్పుటకై వ్రాయబడియున్నది. గ్రంథకర్త చాల శ్రమపడి మామూలు మాటలలో అందరికి తెలియునట్లు యీ దురాచారము తొలగించుటకు యత్నించినందుకు ఎంతయు ప్రశంసనీయుడై యున్నాడు.

ఇట్లు.

సాంఘికుడు



# వైశ్యవేశ్యవధ



## ప్రథమ రంగము.



శా॥ శ్రీరామారమణా విశేష కరుణాసింధూ జగన్మోహనా
పారావారవిశాలలోచన మహేశాదీంద్ర సన్మానిమం
దారాధీరసుచేల శోభితయశోదానందనా నేను ని
న్నారాధింతును సేవజేతు నిరతం నగావరా శ్రీహరీ.

ప్రథమరంగము: రామశాస్త్రి–సుందరశర్మ.

సుం॥ మిత్రమా! వారనారీమణిం జేరువారి దారిం జూచుచునే ముందువెనుకలు విచారించక దండంబున సందియంబందక క్రిందుమీదు లెఱుంగకుండ చరించగ దగునా.

రా—సఖా! జక్కులరాయని ధిక్కరించు యక్కమలనేత్రిని జేరకున్న నామక్కువ యెట్లు దీరగలదు.

సుం—నిజము బల్కిన నిష్ఠూరంబన్నట్లు, సుందరంబున చందురుని హాసించి మందగమనయగు నీసతియుండ నీవిట్లుల దుష్కృతంబు లాచరించుచుంటివి. పిశాచంబగు యీవారవనితం జేత వచ్చునా, మరియు, పరకాంతారతంబు బహుపాతకంబని నె

రుంగవా, యముండు కండకంటలుగ చెండ్రివైచెనా, అంధ
మిత్రాదులు దూషించరా నింతియేగాక,

చ॥ కులమునశించునయ్య నిజకోమలి నెంతయొ చింతనొందు యా
కలదుల నమ్మరాదు సుమి వేచుచుగూచుచునుండి నిత్యముగా
దలచినయంత విత్తమును తక్షణమేగొని రాకయున్నని
దలపదు మానసంబున వృథాశ్రమలొందుటయేల మిత్రమా॥

రా.—బాగు బాగు నీవెరింగినంత ధర్మంబులే నెరుంగనని నీవీ ధర్మో
పన్యాసంబుల సల్పవచ్చితివా యేమి.

యిం.—మిత్రమా యాగ్రహింపకుము. నీవెరుంగని ధర్మరహస్యం
బెద్దియైనం గలదా. నీవాధర్మంబు లెరుంగుటం జేసియే నిట్టి
సత్ప్రవర్తన నలుపుచుంటివిగాన యక్కాంత కాంతు లొక్కిం
త నెరింగింపుము.

కా.—సఖా! యాసతి కెనయగు కాంతలీ ముజ్జగంబులందుం గలరా
దేవ యక్ష కిన్నర గంధర్వ కాంతల సైతము తృణీకరింతు
నయ్యింతి రూపరేఖావిలాసంబుల నెన్న నేరివశంబగును.

యిం.—ఔనౌను! «తావలచినది రంభ తామునిగినది గంగ" యను
సామెత నేనెరుంగనా.

రా.—సఖా యట్లుగాదు ముజ్జగంబులందుఁ గల వనితామణుల లెక్క
సేయని దానిచక్కదనం బెరిగించెద నాలకింపుము.

సీ॥ యిందిందిరంబులో యింద్రనీలంబులో
ఘనపన్నగంబులో కాంతకురులు
రాజీవమో ద్విజరాజబింబంబొకో
ముకుర రాజమొగద ముగుదముఖము
యిందీవరంబులో కందర్ప శరములో
సలిలసంచరములో సఖియకనులు

# వైశ్య వేశ్య వధ

కుసుమగుచ్ఛంబులో పసినిమ్మపంటలో
కనకకుంభంబులో కలికి చనులు.
సింహమధ్యంబుతీరు యీచెలియనడుము
కదళికాకంధముల్, తొడల్ ఘనతమించు
కాహళంబులు జంఘలు గాంచ చాలు
పల్లవారుణ ప్రభ దేలు పాదయుగము.

ఇం—ఆహా యెంతశ్రమజెందినాడవు. మిత్రమా! యిక నొక్కింత కాలము నూరకుండి శ్రమ నివారింపుకొనుము.

రా—ఓరీ వెఱ్ఱివాడ! 'దున్నపోతేమెఱుంగు పన్నగవాసన' యన్నట్లు ప్రపంచజ్ఞానం బావంత యెఱుంగని నీవా యింతిదండంబే మెఱుంగుదువు. ఐనను దెల్పెదవినుము. యేదియో జెప్పబోవును.

ఇం—మిత్రమా జెప్పనక్కఱలేదు యీ నారి విషయమై మీరావంతయు శ్రమజెందవలదు కాముకు లాయింతివిషయమై దెల్పు వాక్యములన్నియు యదార్థమే

రా—సఖా యట్లుగాదు వినుము.

ఇం—యింకెట్లు?

రా—"వేశ్యాదర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం" బను వాక్య మెఱుంగవు గనుకనే యిట్లు దెల్పవచ్చితివి.

ఇం—చెలికాడా మత్ప్రార్థన లంగీకరించి నీసతితో గాలముగా గడుపుకొనుము.

రా—ఓయీ పిచ్చివాడ యీయింతి జూచిన మహానుభావులందరు కామానుబద్ధులై చంచ నేయాధర్మంబేల వినర్దింతును మరియు దెల్పెద వినుము.

## ప్రథమ రంగము.

కలకలలాడుచుండు వెలకామిని మోమునుజూడ మర్త్యులున్
దలపకయుందురే మదిని దామరచూలికి శూలపాణికిన్
గలుగకయుండునే తమకకాంక్షయు హెచ్చదె యోసఖా! భువిన్
జలజశిరోధివంటి సతి చెంతకు జేరియు మాటలాడి బల్
-దలపకయుండు మానవుడు త్రాష్టుడనంబడుగాదె మిత్రమా॥

యాం—(త) యాతడుపట్టినపట్టు వదలుట దుర్లభంబని తోచుచున్నయది. మరియొకవార్తజెప్పి చూచెదగాక. (ప్రకాశముగా) మిత్రమా! నీజనకుండు సకల విద్వజ్జన భూధవస్తుతుల్ నొందుచు నెట్టియశంబునొందెనో నీవెఱుంగవా. యట్టివాని గర్భంబునం బుట్టి యిట్టిపాపంబు లొడిగట్టుకొనుటఁ జెల్లునా. యికనైనను మద్వాక్యంబ లాలకించి కులసతిచే వంశవృద్ధి గాంచుకొనుము.

శా—ఓహో నీపని శృతిమించి రాగంబునబడినట్లున్నదే. సన్నిహితబంధుండవని యెంచినందులకా యిట్లు ప్రేలఁజొచ్చితివి యేమిరా నీవాచాలత్వము. చాలుచాలు సత్వరంబుగా స్వగృహంబు జేరఁగొమ్ము. నాకిక వేళ యతిక్రమించుచున్నయది. యికనే నేగవలయు రా. (నిష్క్రమించును)

యా.ం—(త) ఆహా! కాముకులకు ముందుచూపేగాని వెనుకచూపుయుండదుగదా శ్రీహరీ యీతడా వేశ్య వశంబై నివేశంబునకుం జేరకుండెనే యిక నేనేమిసేయువాడ. (ఆలోచించి) యెవరి కర్మానుభవంబు వారనుభవింపకుందురా! యిట నేనెంత విచారించినను కించుకేనియు ఫలితముంగలదా. యిక గృహంబున కేగెదగాక (యని నిష్క్రమించును)

ప్రవేశము: చంద్రముఖి. (తనలో)

చ॥—ఆహా నాకుమారి మద్వాక్యంబు లాలించక యిచ్చవచ్చినట్లు ధనాపేక్షమాని రూపయౌవన ధన సంపన్నులగు ద్విజశ్రేష్ఠు

లన్నిరాకరించి శతృవక్షచ్ఛేదనాపేక్ష దీక్షితులగు క్షత్రియులఁ బీడి కిన్నరేశునికన్న వన్నెకెక్కి సన్నుతులఁ గొనెడు వైశ్యాగ్రణులఁ జూడక స్వకులాచార సంపన్నులగు శూద్రుల స్వప్నావస్థలందైనదలంచక ధనహీనుండగు యీరామశాస్త్రియే ప్రాధాన్యముగా భావించి దాని యవివేకమంతయు వెల్లడించెనే? హా దైవమా! యిక నేనేమిసేయుదాన. హా పరంధామా! యీముద్దుగుమ్మవద్ద జేరని మందభాగ్యుడెందైనఁ గలడా యింతకు నా పురాకృతకర్మ యనియే భావించవలయు. లేకున్న

సీ॥ రసికాగ్రణులువచ్చి రారమ్మనుచుబిల్వ
 విసుకుజెందక గౌరవించదామె
యింతసొమ్ములుపెట్టి వీధివాకటనిల్చి
 బాటసార్లకు కన్ను గీటదామె
ధనమంతగొని మంచిదని మహీశులనైన
 యాయవారమునర్చ జేయదామె
విభవహీనంబైన విటులకంఠములంట
 బట్టి తానిలువెళ్ళ గొట్టదామె,
తే॥ గీ॥ అక్కటా నొక్కనాడైన యమృతరసము
లొలుక బలుకుచు సభలందు మెలఁగకిటుల
మౌనియైయుండెనో దైవమాకుమారి
యట్టి యవివేక యాటకే నెట్టులోర్తు.

నెట్టకేలకుం బుట్టిన యిట్టి పట్టినింగూడి నాగుట్టు బయల్పెట్టక మనసు దిట్టపరచుకొని పొట్టకూటికై వట్టి ప్రగల్భంబుల గొట్టుచు నెట్టులో ధనంబార్జించి సుఖంతమనుకొన్న యాస్లు సాగదయ్యెనే హా యిక నేనేమిసేయుదాన (ధైర్యముచే) కానిమ్ము చతుర్విధోపాయంబులం దేదియైన జక్కఁబడకుండునా. యిక నేజని నా సుతాతిలకంబునకే హితంబు గరిపెదగాక. (నిష్క్రమించును.)

(ప్రథమరంగము సమాప్తము).

# ద్వితీయ రంగము.

ద్వితీయరంగము. ప్రవేశము: పెద్దిశెట్టి-యొంటరిగా యింటిలో.

పెద్ది—అంబాబో, యీ బావనిశాస్త్రుల్లగారి డబ్బంతా సుందరి లాక్కున్నదని పుల్లిశెట్టి సెప్పాడుగాదు. అబ్బో అబ్బో సుందరెంత సక్కంగాయున్నదో ఎన్నినగలేసుకుందో. యెంత అందంగాయున్నదో అందుకనే రామశాస్త్రుల్లు సొమ్మంతా దోశెట్టి మళ్ళి నాకాడికి బాకీకివచ్చాడు కావచ్చు బోగం దానివద్ద డబ్బుంటేగాని మనిషి శెలావణికాడు. యిప్పుడు నాకేం కొదవ లక్షాధికారినని దేశమంతా పేరొందానుగాదా యిక సక్కని సిల్కుండ్వా కప్పి తమపాకిడెం బుగ్గనెట్టి వీధులంట తిరుగుతూ దానింటి కెళ్ళాల దాన్ని శూడాలి నామనస్సు నిల్వాలి యంత దాకేమిలోసదు యిక సప్పున యెల్లాలి. యని. (ముందుకు నడచును)

ప్రవేశము: పుల్లిశెట్టి.

పుల్లి—దండవండో శెట్టిగారు. మీరెక్కడి కెళ్ళుతుండారు బాబు.

పెద్ది—నీవా బోగం సుందరిని సూసినావటయ్యా. అదెంత సక్కనిదో నీకేమైనా తెల్సునా.

పుల్లి—అబ్బో అబ్బో శెట్టిగారు బోగందాన్నిపై కన్నేసినారాయేంటి.

పెద్ది—బాబూ లేదులేదు మాయింటిలో మేళం కావలసొచ్చి దాన్ని పిల్వామని యెళ్ళుతూయున్నాను.

పు—సొమ్ము లంగోస్తుంది మీరు చాలా సప్పనరావాలి

పె—మొర్రిమొగమా నేనెరుగనా యేమి

పు—అట్లయితే సప్పునెళ్ళండి, నాకు శెలవేనా.

పె—మంచిది. నేనుకూడా యిప్పుడేవస్తాను పద.

(యిరువురు నిష్క్రమింతురు.)

ప్రవేశము: నీలవేణి. సుందరి.

సు—చెలీ ! నాతల్లి యవివేక మెఱింగితివా

నీ—యిందు యవివేక మేమున్నది పూర్వాచారంబుగా నడుచుట కంత కష్టమెందులకు.

సు—సఖి పరపురుష సాంగత్యం బత్యంత పాతకంబను టెరుగవా. మరియు,

చ॥ పరువునశించు కీర్తి యెడబాయును మాననమందు చింత చే
కురును సఖాళి దూరుదురు కోరిక లెన్నియొ హెచ్చిపోవునే
పరణిని కూడుదుర్ ఇటుల పారసలోచన యేటికీగతిన్
జరుపుటకన్న మాధవుని సన్నిధిజేరిన మేలగుర్ చెలీ.

పరమపురుషుని పదపజేరి మొ రలిడ కరుణించునుగాన యిక యా రమావరుని నా మోచ్చారణ సేయుచు కాలముం గడిపెదగాక.

నీ— ఔనౌను "పిల్లకాకికేమి తెలుసు వుండీలదెబ్బ" యనునట్లు బాల్య దశగాన యిట్లు బల్కుచుంటివి లేకున్న యీ నతీమణుల క్రీడల నోలలాడుచునేయుందువు.

సు—సఖి ! నీవీవిషయంబే మెరుంగుదువు. సకల చరాచరజీవకోటి కా ధారభూతుండగు వేదవేద్యునిగాధ లెన్న నేరితరంబగును. మరి యు మనుజుని స్వతంత్రత యెందైనంగలదా. "మద్భాగంతు మనుష్యాణాం సత్వమందైవ చితనం" బనుట నెరుంగవుగాన కేవల మా కామప్రధానమగు హితంబు గరపవచ్చితివి.

నీ— చెలీ! కామశాస్త్రము జూడలేదు గనుకనే యిట్లుబల్కుచుంటివి. లేకున్న మా కీశ్రీమతే కలుగకుండ సుఖంతుముగాని నీవు మా టిమాటికి హరినామసంకీర్తన చేయుచుందువే వందు గల్గు ఫలితమింతకంత నెరుంగజేయుము.

సు— తెల్పెదవినుమో లలనా గజగమనా,

సీ॥ సన్మార్గగమన ప్రసాదయోగ్యరథంబు
ఆయురారోగ్య ఫలాస్పదంబు
కామాదిమహితాంధకార ఖద్యోతంబు
అఖిలరోగ నివారణౌషధంబు
దురితాటవీసాంద్రతరదవాగ్ని కణంబు
బహుళ సాధనకోటి భావుకంబు
భవభుజంగహర ప్రభావ ముఖ్యఖగంబు
భూషితాశ్రిత కల్ప భూరుహంబు
విజయమధికంబు సుగుణత వితరణంబు
సుఖయశశ్శ్రీమహామోద సుస్థిరంబు
పరమపావన భరిత కృపాంసంబు
హరిపదధ్యాన మధురతరామృతంబు.

నీ— చెలీ నీవు చెప్పినవన్నియు నిజమైన యీ మనుజులందరు శ్రీ
మన్నారాయణ పాదకమలములనే సంధ్యానింపుచు ముక్తినొంద
కుందురా. అబలా, యేల యీలీలబేలవై గోలజేసెదవు యిక
నైన నీమాతచెల్పు నడవడినే యనుసరించి సంతసంబున వర్తిం
తము రమ్ము.

సు— యింతీ నీవెంతయు శ్రమజెందితివిగాన నిక యిట్టిపల్కు లావ
లగట్టిపెట్టి నొక్కింతకాల మూరకుందుము.

నీ— సఖి నీ క్షేమమెరింగించ నింత యాగ్రహంబు జెందతగునా.
పోని నీకవసరంబులేని ప్రశంస నాకెందులకు.

ప్రవేశము: చంద్రముఖి.

చ— కుమారీ! నీయంత యవివేకురాండ్రెందైన గలరా. వనితలు

బాల్యంబాదిగా మాతాపితృవాక్యానుసారముగా నడువవల
యునన్న ధర్మంబీవెరుంగవా, తోటివారలు నవ్వరా, యిక
నైన నసంతనంబున విటులచెంతజేరి చిత్తమొచ్చినంత విత్తముఁ
గొని సుఖింపుమో బాలా గుణశీలా.

సు— తల్లీ పరపురుషేచ్ఛగోరతగునా దానియంత పాపంబు మరియొం
డెద్దియైనం గలదా.

చ— ఛీ దుర్మార్గురాల నేమెరుఁగనని యా ధర్మోపదేశంబులు సేయ
వచ్చితివి.

పా— తల్లీ నొక్కనిజేరి సుఖింపగూడదా.

ఉ॥ కాంతమనంబునఁ దలచు కాంతునిజేరిన చింతబాసియా
కాంతయు కాంతుడుఁ సుఖముగాంతురు నెంతయు ప్రేమతోడుతన్
సంతసమొందుచున్ మిగుల శాంతిపథంబుననుండు రెవ్వఁడున్
సంతసమేడయుంబగుచు శాశ్వతకీర్తియు గల్గు తల్లిరో!

చ— యేమి నీవాచాలత్వము యంతకంతకు "తొండముదిరి యూసర
బిల్లి" యగునట్లు ముదురుచున్నయదే.

సు—(త)హా ధాతా యనాధః పేరిత, నీవెట్టి దుండగంబులాచరించ మొ
డిగట్టితివోయి, ధనపిశాచంబు బట్టి పీడించుచున్న యీ వేశ్యా
కామిని గేహంబునందేలనఁ సృజించితివి. నీకంటికి నేనేయగ
పడియుంటినా, నీవింత నిర్దయుండవగుటఁ జెల్లునా. హా దైవ
మా యిక నేనేమిచేయుదాన (పరికాశముగా) తల్లీ యింత
ధనముండ కాలికిఁ గజ్జగట్టి అన్యులయెదుట నాట్యమేల సే
యమందువు.

చ— తనయా సిరి రా మోకాలు యొడ్డువారలుఁ గలరా వేయేల
ధనహీనుండగు యారామశాస్త్రినిఁ వదలి మరియొక ధనవం
తుని జేరదీయుము. నామాట వినుము.

సు— జననీ పరపురుష సాంగత్యముం జేయజాల నా మనవి యాలకించుము.

చ— చాలుచాలు నీయిచ్ఛకంబు లాపలెఁ గట్టిపెట్టి మనంబు దిట్టపరచుకొని పొట్టకూటికై నెట్టులో ధనంబార్జించు నుపాయంబరయుము లేదేని నేవిధించు శిక్షలకు సిద్ధముగా వేచియుండుము.

సు— హా నందనందనా యమందానందం బొందుచు నాముందరఁ జేరి డెందంబున సందియంబు బాయ నట్లానరించరాదా నీదాసురాలిపై నిట్లాగ్రహింపతగునా అనిశంబు నీపాదకమలంబుల నా డెందంబున పాదుకొల్పుకొనుంగదా భక్తరక్షణ దురంధరుండనను బిరుదు బాయదలంచితివా, శ్రీహరీ నీవేయిట్లు పేక్షింప నన్ రక్షించువార లెందుండగలరు. యిక నేనేమి సేయుదాన.

చ— తనయా యేమియు మాట్లాడక శిల్లముకొట్టినరాయివలె నిలుచుంటివే, పలుకవేల, యలుకయేల.

సు—(లే) నిప్పట్ల యీశనిగ్రహంబువడలుటదుర్లభంబనిదోచుచున్నది. యదెట్లయినను మాతాపితృ ఆజ్ఞనే యనుసరించెదగాని పరపురుష సాంగత్యంబుజేయునెడ యఘంబుల పాలుగావలసినదే కదా! (ప్రై) తల్లీ నీయాజ్ఞానువర్తినై చరించెదలెమ్మా.

చ— తనయా యిప్పుడుకదా మద్వాక్యంబు లాలకించి కర్ణరసాయనం బొసఁగ జక్కని పలుకులఁ బల్కితివి. యిక యారామశాస్త్రి నేమైన మాటలందెచ్చిన యవి నాక్రమించి యున్మత్తునింగావించి యిల్లు వెడలగొట్టవలసినదే.

సు— తల్లీ యట్లుగావించెద.

చ— విత్తములేని మాటలయెత్తవలదు సుమా.

సు— జననీ కాలాతీతంబగుచున్నయది జనుదము రమ్మా (అని నిరువురు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము సమాప్తః

# తృతీయ రంగము.

---

తృతీయరంగము: (ప్రి) చాందూఖాన్ హుసేన్.

హు—అరేభాయి చాందూఖాన్ తూ సుందర్కి దేఖోరే

చా—బరాబర్ దేఖ్యా హైరేభాయి

హు—వో అవుత్ సాలా నక్కనివాడురే చాందూఖాన్ వాణ్ని
మై దేఖే హెన్ని హెన్ని సొమ్ములు హైరేభాయి

చా—వాడు హెట్లావుంటె మన్కి హేందుకు రేభాయి

హు—అరెతోబతో బుకీకిహెట్ల బోల్నానకోరే హాయ్యా దాన్కి
దాన్కి నూశింది మొదలి నాకి హరాళ్ళల్లా జల్ జల్ హంటూ
హుండాది మాకీ వాడు దాన్కి హెట్లాహైనతాది కర్లేవుం
గా, సునోభాయి, హమారేపాస్మే దోహాజీర్ రూపాస హై ఏ
రూపాయ్యవునుకదియేకొ వాణ్కు లేక రావుంగా

చా—(త) ఏజంగల్ ఆద్మిరాపాస్య సబ్ వోరండికిదియేకొ దూసరాహిం
టికడ నాలెనేకొ ప్రిస్తిహుంత మాకీ హేంశేయాల. అరేభాయి
వోచాత్ చోద్దేక అబిబొహాత్ వక్తుహేగయ హివుసు గస్తి
కరింనేకు జల్దిఅవ్వరేహయ్యాం

హు—అచ్చాభ జాయింగె చలో, (యని నిరువురు నిష్క్రమింతురు)
(సుందర యింటిముందర ప్ర: రామశాస్త్రి—(తనలో)

రా—అక్కటా యక్కటిలాలిక మక్కువలేక పెక్కు చిక్కులపాలు
గావించనే నేనెక్కడని సహించువాడ, పెక్కు చిక్కులకోర్చి
నాకక్కరకొచ్చుగదాయని లెక్కసేయక పెక్కు రొక్కము
వంగిలినే నత్యమొక భూషణంబొసంగియు నేను రిక్తహస్తుండ

నై వచ్చితినని కనికరంబుమాని యిక్కరణి మొదబట్టి బహిః ష్క్రింతంబునకు గెంటివైచెనే యిప్పుడు సందరు నిరాకరించువా రలేగాని నావలె నొక్కడును మేలుకొనియుండువాడు గానరా దుకదా సలుదిశలంధకారబంధురంబుగా యుండు యీ నిశీథ సమయంబునందు నేనెందేగువాడ అని (ముందుకు పడచును)

(తెరలో) గస్తికర్నేకు వుధర్జాయింగే అవురే.

శా—యెవ్వరో మహానుభావు లిటరుదెంచుచున్నట్లున్నది వారితో నించుకంత మాట్లాడి వారి సహాయ్యంబున స్వగృహంబు జేర దగాక— (ప్రః) చాందూఖాన్ — హుసేన్.

హు—అరే హుసేన్ ఇకడ ఆద్మి ఆద్మి మిుణిపి హైరె

హు—కహాకహా

చా—ఓచోరివా బై ఒడేఖోరె, అని చూవును

హు—వాణ్కి పకళ్లేవురే పకళ్లేవురే

చా—తొందరచే జని (రామశాస్త్రి చెయ్యిపట్టుకొని) అరే తూ కోనేర్రి, అని (కొట్టును)

రా—గద్గదస్వరముచే, అయ్యా నేనుదొంగనుగాను నన్నుకొట్టకుడు.

చా—తూ చోర్ ఆద్మినైరె చోరినైతో హింతరాతికి హెూదుకొ చ్చినావురె, అని (మరల కొట్టును)

శా—అయ్యా నేనొక విప్రుండను నేనితరగ్రామమునుం డిట కరు దెంచువరకు నింతరాత్రి ఆయెను యంతియేగాని నేచోరుండ నుగాను నన్ బాధించక వదలుడు (అని ప్రార్థించును)

హు—ఓ బామ్మన్ వాలకతె ఛోడ్దవురేభాయి

చా—తుంబామ్మన్ హైరె సబ్ బాతెరె బద్మాష్

రా—అయ్యా సత్యముగా నే బ్రాహ్మణుడనే, యింటిలోనుంచి చంద్రముఖి, ఓరక్షకభటులార యాతడు నిక్కమైనదొంగయే. యిదివరకొకసారిరాగా యేమెరింగి కేకలిడ బరుగిడియుండెను. యిప్పుడు మేము నిదురించితిమని కాబోలు వారల యిట కరుదెంచినాడు మీరిక యాతనిగొంచని కారాగారబద్ధునిఁ జేయకున్న మాగృహంబునఁగల వస్తుయాభరణంబులెల్ల నపహరించునని మానంబునం భీతివొడముచున్నయది గాన మమ్ము రక్షించుభారముఁబూని యీబాధ నివారింప మిమ్ముల వేడుచున్నదానను.

వా—<br>బా— } తూ చోర్‌నై రె బద్మాష్ (అని కొట్టుచు) చలో జమల్దీ (అని లాగుచు నిష్క్రమింతురు)

ప్ర॥— శేషగిరి, నారాయణ

---

నా— శేషగిరి యా సుందరి పొందుగోరి యనేక శ్రమల జెందినను యా నారి దర్శనంబు లభింపదాయె నే నేమిసేయువాడ యా యింతి చెంత జేరకున్న సంతసం బావంతయు గల్గనేరదు కదా.

శే— మిత్రమా వేశ్యకామినిఁ జేరరాదను ఆర్యోక్తి నెరుంగవా యేమి?

నా— ఆహా నీవెంతయు ఛాందసుఁడవనియే భావంబునం దెరుంగ వలయు లేకున్న యా బంగరు బొమ్మను జేర దోషంబారోపింతువా.

శే— చెలికాడ కామము గ్రుడ్డిదను టెరుంగవా యేమి ధనోన్మత్తతచే నొడలెరుంగక వెలవెలంముల గలయగోరు మానవులందరి ట్లనట సహజమే నిందావంతయు తప్పిదంబు లేదు.

నా— సఖా యీ యనవసర సంభాషణ గట్టిపెట్టి వేశ్యానివేశంబునకుం జేగ నము పద.

శ్లో—

శైశవః ప్రియుండగుటం జేసి నీతనియెడ బాయుదమన్నను మన్మనంబు సమ్మతించదాయెనే, నారెసారెకు వీరవనిర్గ జేరవలదనిబోధించిర్గ వినదాయెనే ముందునుయ్యి వెనుకగొయ్యియన్నట్లున్నది యిక నే నేమొనర్చువాడ (ప్రి)యుబ్లైదనుదము పద. (ఇరువురునిష్క్రమింత్రు)

ప్రి—నీలవేణి, సుందరి.

షు— చెలీ! పాప మా రామశాస్త్రిని యా రక్షకభటులు నా తల్లి మాటల నమ్మి చెరసాల ప్రాప్తినొందజేసిరికదా, మజ్జనని యింత దారుణం బేలచేయవలయు.

సీ— సఖీ యెవరికర్మానుభవంబు వా రనుభవించక దప్పునా మరియు నిందు నీమాత తప్పిదం బావంతయు లేదు యాతడిటువచ్చుటయే తప్పిదందబని నెరుంగము.

సు— సఖీ సత్యము వక్కాణించితివి ఘాతకమృగంబులవంటి వేశ్యల పంచజేరు మనుజులందరు నిట్టి శ్రమ జెందుదురనియే నీ యభిప్రాయము.

షీ— ఇందుల కావంతయు సంశయంబు లేదు గాన మన మావన చిత్రంబుల కనుగొందము.

సు— ఔ నౌ, సత్వరంబుగా జనుదమువద, (అని నిరువురు నిష్క్ర-మింతురు)

[ఒంటిగా హుసేను—ప్రవేశించును]

హు—హల్లా నీ కీ దయ సక్క గాసూపి వో సుందర్కి మాకి షాది కరో రె హయ్యా నీకీ సలాం సేస్తాము రే హయ్యా మాకి జల్దీ పెళ్ళి కరో రె హయ్యా, (సలాములు జేయును)

ప్ర॥ చా—అరే తూ క్యా కర్నేకు ఇధర్ వైఠరే నీకి హెవ్వుడు సుందర్మిద్కి భాంతిహై మై ఏక్ వాళెరేతో ఓ -సోరి బోహ త్ గడ్బిడు కర్తాహై రె భాయి.

హు—(త) అగ నాకి హెంకడపోతె హకడ్కి హీ సైతావ్వాల హే దుర్ హవుతార్ మై క్యాకర్నా, (ప్ర) అరెచాదూఖాశ్ మై అభీ అవుంగా తూ జావురె

చా—హం తుం దోనో మిల్కర్ జాయింగే ఆవురే (అని లాగుచు నిష్క్రమింతురు)

[ప్ర—నీలవేణి, సుందరి, వుద్యానవనమందు]

సుం—చెలీ నీలవేణి యీ వనరమణీయ్యంబు నా స్వాంతంబున కిం తయు సంతోషదాయకమై మెలంగు చున్నయదే.

నీ— సఖి వాటికేమిగాని యీ క్రీవనించుక వీక్షింపుమా కేలజూ పుచు

చ॥ చక్కని కేతకీవకుళ జాజికురంటక పారిభద్ర్య మే ప్రిక్కనుజూదినా యధిక పంక్తుల దీర్చిన జంబపాలమా త్ మక్కువగల్గజేయు నిటమాలతి నెంతయు సాతసంబిడా నిక్కముదెల్పితిన్ వినియు నీ దిశజూడుము కోమలీమణీ

మరియు నావిమల సలిలాసారంబగు యీ కాసారంబున మీనంబులు బట్టుటకై వేచియున్న బకంబులం గంటివా.

సు— చెలీ వాటికేమిగాని నీ దిశ వీక్షింపుము చిలుకముక్కులచే నొక్కంబడి కెంపురులీచుచున్న దాడిమీ ఫలభూజంబులును మార్గాయాస సంజనిత తృష్ణావిదారుణులగు నారికేళ రసాలంబులును, కందర్పుండు తనవిరుశరంబులకు బదునుబెట్టు కదళీ తరువులనుండు లేతమామిళ్లును మల్లెల తలారసాలంబునకుం అల్లిబిల్లిగ నెట్లల్లుకొని యున్నవో గంటివా.

నీ— కాంతాతిలకమా విశాలంబగు యీసాలంబునుం జూడుము.

సు—విశాలంబగు యీసాలంబుకడ కొంతవడి విశ్రమింతము రమ్మా.

సై— చెలీ యట్లేచేయుదమువద (అని నిరువురు నొక వృక్షమువద్ద కూర్చుందురు.

ప్ర: శేషగిరి_నారాయణ.

శే— సఖా యీరమణీలలామ యివ్వనప్రదేశంబున వినోదార్థమై జననేత్ర సుందరిమాతయగు చంద్రముఖ వచించుటచే జేసి యీశృంగారవనంబునకుం జేరితిమికదా. యిట మందగమనయగు సుందరి వదనారవింద సందర్శనమేగల్గదాయె యిక నే నేమి సేయువాడ.

నా— సేయుటకేమున్నది తృటికాలమీ వనప్రదేశంబునందుండి యీవంతరమానాతి గేహంబున కేగుటయే యుచితము.

శే— మిత్రమా బాలశశి సమానయగు యీసుందరి సమానులగు యిందువదనల నెందైనన్ జూచితివా, ఆ జగన్మోహనాకారిణి సందర్శించు భాగ్యము మనకుఁగలదా?

నా— ఓరీ వెరిప్రివాడ! విత్తము కొద్దివైభవంబను టెరుంగవాయేమి విత్తమొసంగినఎత్తు జిత్తులెరింగిన యావేశ్యామాదిని జేరుటెంతవింత. నలుదిశలుజూచి, (ప్ర) మిత్రమా! నీవెంతయు నంకల్పసిద్ధుడవు గావుననే యాకనుగీలలామ, యాసాలంబుకడ యున్నది రమ్ము సత్వరంబుగా జేరుకొందము (సు) సమీపింతురు.

సు—ఓ మహాభాగులార! యింతులుండు యుద్యానవనంబుల శూరాగ్రేసరులు జేరవచ్చునా, మీకిది భావ్యంబని దలంచితిరా?

నా—(తనలో) యేమీ దీనిమాయలు నేనొక మహాసాధ్వననియేబల్కుచున్నయదే ఆహా! యింతుల యంతరాత్మ నేరిశక్యంబగును.

శే— చాలీ! పురుషులీవనంబు జేరవలదని బిరుదు పట్టంబులఁగట్టిన శూరులేరైనఁగలరా?

సు— ఓ వీరపురుషులారా! శశిసమానులగు మీరియ్యెడ కేల యరుదెంచితిరో వించుకంత నెరుంగజేయుడు.

శే— త్వదీయ దివ్యమంగళ విగ్రహ సంపర్శనార్థమై యరుదెంచినారమని నెరుంగవాయేమి.

సు— పరకాంతారతంబుఁ గోరవచ్చునా యింతకన్నెక్కుడు పాపం బెద్దియైనఁగలదా, యిక నామనవి నాలకించి స్వగృహంబునఁ జేరుకొనుడు.

నా— (తనలో) అమ్మయెయ్యో యిది కొంపలుదీసిన కొరివిగాని సామాన్యరాలుగా గన్పట్టుటలేదే, (ప్ర) యో నారీరత్నమా వ్యేశలెందైన పతివ్రతలనుటెరింగితివా? యిక యనవసర సంభాషణల్ సేయక నామిత్రుని యనుగ్రహంబునఁ జెందుము. నామాటవినుము.

శే— సఖీ నీపొందు నభిలషించి నేనిం దరుదేరసించుకమైనన్ జాలి నొందవేల.

ఉ॥ తాళగజాల యీవిరహ తాపము నేడిక హెచ్చిపోయెనో,
బాల సహింపజాల సుమబంతులబోలెడు నీదుచన్నుఁగన్
శీలతబూని నాకిడియు చింతదొలంగగజేయ కన్నిటన్
కాలవిరామమీవిధిగ గానక సల్పుటమానుమో ప్రియా.

చుక్కలరాయని ధిక్కరించు చక్కనిదానవని మక్కువచే నిక్కడ కరుదెంచ నీవిక్కరణిన్ బల్కజెల్లునా, నాపై దయగనుమో లలనా గజగమనా.

సు— ఓ ఆర్యశిఖామణులార మద్గృహంబున కరుదెంచిన నాతల్లి ఆజ్ఞానువర్తినై చరించెద మీరిక నిజమందిరంబులన్ జేరి మజ్జననిష్టంబొనర్చిన యనంతర మాలోచింతము. నాకిక వేళ యతిక్రమించుచున్నయది, నేనేగవలయు సఖ నీలవేణీ! సత్వరంబుగా నివేశంబునకున్ జేరుకొందము రమ్ము. (అని సరువురు నిష్క్రమింతురు)

నా— మిత్రమా నిట యాలసింపనేల సత్వరంబుగా నిజమందిరంబు జేరి యనంతరమా కర్తవ్యము నాలోచింతము రమ్ము

శే— కర్తవ్య మేమున్నది. యెట్లైన యానాతినిం జేరకున్న నే జీవించుటకల్ల యని నెరుంగుము.

నా— అట్లైన నీ యిష్టమెట్లో యట్లే కానిమ్ము (అని ఇరువురు నిష్క్రమింతురు.

తృతీయరంగము.

సమాప్తము:



# చతుర్థరంగము.

[ ప్రవేశము—పెద్దశెట్టి, ఫుల్లిశెట్టి ]

పె— ఓమయ్యో ఫుల్లిశెట్టి యీబోగంసిన్నదాన్ని శూశినావటయ్యో.

ఫు— అబ్బో అబ్బో శెట్టిగారు సుందరిపైన కన్నెశినారాయేంటెని

పె— కాదయ్యో. ఆసక్కదనమెంతయు మెచ్చదగినదికాదటయ్యో

ఫు— సిత్తంబాబు మీరన్నమాట యదార్థమే.

పె— అందుసేతనే దానింటికెళ్ళి శూత్తె మాట్లాడివత్తాము వత్తావా?

ఫు— అంబాబో బోగంగానింటికే పెంతమాట శెలవిస్తిరి.

పె— యేం! రాకూడదాయేంటెని

ఫు— నాకు దాన్నిశూత్తేనేభయంబాబు.

పె— అట్లయితే నీవు రానక్కరలేదులే.

ఫు— బాబు నాకుశెలవాండి

పె— ఓ ఎట్టిమొకమా నప్పునింటికెళ్ళు (ఫు) సిత్తం. (నిష్క్రి)

పె— (తనలో) అంబాబో యీసుందరెంతబాగుందో యెంత సక్కనదో ఎన్నినగలున్నవో అమ్మయ్యో యిదరంత యీ రామశాస్త్రి సలువుయేకాబోలు పాపమా బ్యామ్మనివద్ద డబ్బంతాలాగేసిందని ఫుల్లిశెట్టి శెప్పాడుగాడు. అమ్మయ్యో ముందు డబ్బుంటేగాని బోగందానివద్ద మనిషి శెలామణికాడు. యిక యిచ్చటెంత యనుకున్న నేమిలాభం దానింటికెల్లాలి దాన్నిశూడాలి నామనసు నిలవాలి, అంతదాన కేం తోసదు. నేనిక నప్పునెల్లాలి (యని పెద్దిశెట్టి నిష్క్రమించును)

కారాగారమందు ప్రవేశము: రామశాస్త్రి. (తనలో)

కట్టా యేసెట్టి యిక్కట్టులపాలైతినే ధారాయనాథః శ్రీశా నీమనసంబందావంతయు సందియంబు జెందవుగదా, హా దైవమా యిక నేనేమిసేయుట దుష్టపిశాచంబులగు యీవేశ్యలఁ జేరి ధన కనక వస్తు యాభరణంబులెల్లఁ ధారబోసిన నాయట్టి నిర్భాగ్యుని గావరాదా తండ్రి.

ఉ॥ అన్నలు దమ్ములుఁ హితులు నా.. లు బంధువులెందరో భుజఁ
కన్నులజూచియుఁ హితవు గావగజెప్పిన యాలకించకఁ
వన్నెలమారిమైనసతియొద్దకు జేరియు దెచ్చుకొంటి యా
వన్నత నేడు వాటిలెను పాపవినాశన శ్రీవరాహరీ.

వినాశకాలే విపరీతబుద్ధి యను చందంబున ధనోన్మత్తతచే నొడలెరుంగక వెలవెలందుల గలయనెంచిన నాయట్టి పాపునికిట్టిశాస్తి యనియే భావించితివాయేమి శ్రీహరీ యీ దుష్కరాలు మెడబట్టిగెం టుచుండ యచ్చటనే యుండనేల యుండినంతన కేగదా నిప్పట్లకా రాగారనివాసము సేయవచ్చె. హా పరంధామా యిక నెట్టులైన నా యిక్కట్టులబాపి నన్ రక్షింపుము రక్షింపుము. (అనినిష్క్రమించును)

ప్రవేశము: పెద్దిశెట్టి - సుందరి

పె— ఒశేల్ సుందరి నేను నీయుండనుండ నీకింకను సింతయేల.

సు— లేకుండిన దెంతలాభమో యుండినను నంతలాభముగానేయుం డ నేనేమిసేయుదాన.

పె— అబ్బో అబ్బో నీవెంత మాయలాడివే నీయిట్టమేంటో శెప్ప రాదాయేం తీర్చనాగేంటి

సు— కోరికయేమున్నది నాతల్లి నేడు పది వేలరూప్యంబు లార్జిం చకున్న కాయమెల్ల గాయంబులగునట్లు చెండెదనని దండ తాడితమైన భుజగంబుభంగి మండిపడు చెరుంగరాయేమి.

పె— ఓ యెర్రిమొగమా యింతదానికే యింతచింత జెందాలెనా యిదిగో తీసుకో తీసుకో. పదివేయిలు రూప్యంబులిచ్చునా.

సు— ఆర్యా మీసేవలభించుటకు జేసినేకడ ధన్యురాలనైతిని నా ఫలంబు ఫలించినదనియే జెప్పవలయు.

పె— ఒ. శేల్ నీవుమాత్రిం నన్ను సక్కంగాశూస్తివేని లక్షాధికారిని జేయును. యింతకు నీవుమాత్రిం నన్ను సక్కగా కనిపెట్టాలి.

సు— వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగమాణిక్యంబులచే దులదూగు కినకేశునిగన్న వన్నెకెక్కిన మీయున్నతస్థితి యే నెఱుంగనా యేమి, (యింటిలోనుంచి) అమ్మాయి వృద్ధవైశ్యునితో సలసంబులాడుచు భోజనంబున కరుదెంచుటయే మఱచి యుంటివా యేమి. మహాభాగా మజ్జననిపల్కిన వాక్యంబులాలించియే యుందురుకదా. యిక నే భోజనంబున కేగవలయు గాన మీరిక నిజనివాసంబు జేరి సాయంకాల సమయంబున దరుదెంచ మీసంకల్పం బీడేరునుగాన మీరిక సత్వరంబుగా గృహంబున జేయకొనుడు.

పె— యిదిగో యిటను సాయంకాలం తప్పక రావచ్చునా?

సు— ప్రియా మీతో యెన్నడైన యనృతమాడియుంటినా?

పె— లేదులే.

సు— ఆర్యా! నాకిక శెలవేనా?

పె— మంచిది. యిదిగో నేనుకూడావెళ్ళుతున్నాను.

(సు॥ పె॥ నిష్క్రమింతురు)

ప్ర: హానుసేన్. (తనలో)

అరె హాల్లా వోరండి టూకి హెంత మోసం శేసిందిరా హమారా, దోలచ్చరూప్యాలే కర్హాంకు బహార్ మే ఛోడ్దియారె హాల్లా అబిమైక్యాకర్నా, (అని చింతించుచుండును.)

ప్రి: చాందూఖాన్. అరెహు నేన్ యాన్యా శాయకు బైటేరే.

హు—బాయి మైక్యాబోల్నావో బోగంవాడు మాకి హెంత మో సం సేసాడు రె హమార్ పైస సబ్ లేకర్ హమారహాత్ పక ళ్ళేకో బహార్నే భోడ్దియారె చాందూఖాన్ ఓ బద్మాష్ ఘుర్కు అభీజాయింగే అవురే.

చా—హాం బోల్నేతో తుంచాన్కు హెంతపని శేసినావురె అచ్ఛా ఛా జాయింగేబోలో, (అని యిరువురు నిష్క్రమింతురు)

[యింటిలో శయ్యపై శేషగిరి ప్రివేశించును.]

(శే) హా సుందరీ నాయందింత నిర్దయన్బూని మన్మథు శరా గ్నిపాలుగావించుటల్ జెల్లునా.

ఉ॥ యింతిరో నీదు రూపుగని యేవిధి నీదరి జేరుదో యనే
చింతనుజెంది యుంటినను జేరియు నాదగు ప్రేమదీర్చ బల్
సంతసమొందుచున్ మరునిసాయకముల్ వారియించినావయ్యో
పంతముబూనకన్ యధిక పామరమొప్పగ బ్రోవవే చెలీ!

హా సుందరి నీపొందుగోరి నేనొందు యిడుము లెరుంగకుంటి నూహా జగదేకసుందరీ శూరుండగుమారుండు క్రూరనారాచంబులే వారివై చుచుండెనన్ గావుమోలల నాగజగమనా (నించుకయూర కుండి) యేమి యీమదనుని దుండగంబులెన్న నేరకైనన్ శక్యం బగునా. (ప్రి) మన్మథును ద్దేశించి, ఓయీ మన్మథా నీవిట్టి క్రూరుండ వగుటచేతనే నిన్నాముక్కంటి కంటిమంటలచే దగ్ధునిగావించుట. పాపమారతీరమణి దయారసహృదయ గనుకనే మరల నిర్బ్రతికించు కొనియె, లేకున్న యీమానవుల కష్టంబులెల్ల గట్టుకొను గదా. ఓరీక్రూరా యింకను నీశౌర్యమడంగలేదా, ఛీ దురాత్మ (ఆకాశము వంకజూచి చంద్రు నుద్దేశించి)

తే॥ గీ॥ చల్లదనమునంగునుగాదె చంద్రుడనుచు
జనములాడువాక్యంబుల సత్యమయ్యె
చల్లదనమింతయును లేదు చంద్రనిన్ను
మింట గనుగొన్న నాకును మంటలాదవె.

మృగాంకా!యంగనలేని కాలంబున నన్నీతెరంగున భంగపరుప న్యాయంబగునా. (కోపముచే) ఔరా కులద్రోహీ ఛీ దురాత్మ నీచల్లదనం బిప్పట్లు నగ్నిహోత్రింబయ్యెనుగదరా, ఓరీ పాపి నీవు పాపపుణ్యంబు లెరుగుదువు. గురుపత్ని యని మనంబున నరశయించక కలసిన దోసకారివికావా? అక్కటా జక్కులరాయని మచ్చరంబున పెచ్చుపెరిగి యిచ్చవచ్చినట్లు ప్రేలజొచ్చితివే, (నించుక యాలోచించి) నారాయణుండింకను రాకపోయెనే కటకటా నేనేమి సేయువాడ. (యని విచారించుచుండును) ప్ర: నారాయణ.

నా—మిత్రమా యాయన్నులమిన్న నీవన్నెలకచ్చెరువంది నీసేవయే యానాతి కర్తవ్యంబని నీరాకకై నిరీక్షిస్తూయున్నది సత్వరంబుగా జేరుకొందము రమ్మా.

శే— సఖా నిజముగా యట్లుచెప్పెనా.

నా—చెప్పుటయేగాదు నిన్ను దోడ్కొనిరమ్మని వక్కాణించినది.

శే— (త) ఆహా నేటికిగదా సంకల్పం బీడేర్చుకొను పుణ్యమునొందుట (ప్ర) నచివాసత్వరంబుగా వేశ్యానివేశంబునకుఁ జేరుకొందము రమ్మా. (యిరువురు నిష్క్రమింతురు)

శేషగిరి—సుందరి.

శే— మారుండు కూరుండై కూరనారాచంబుల పెక్కు నన్నుబెట్టినఁ జిక్కజేయుచుండెనా మక్కువదీర్చవే లలనా గజగమనా.

సుదతిరో మారుడీవిధిని శూరుడనంచును మాటిమాటికిన్
వదును శరాళిచేతనను బాధలనొందగ జేయుచుండె యా
మదనుని దుండగంబులకు మామక ప్రాణములుండ బోవుటో
మదనుకకారి యింక యనుమానము బూనక నేలవే సఖీ

సు— చారుకేసల శరీరకాంతులొలుకు హేమలతయుండ నన్నేల జేరవచ్చితిరి. యింతటి యవివేకమెందైనన్ గలదా రత్నంబున కాశజెంది నత్తగవ్వను స్వీకరించిన చందంబొప్పునా ? యిది యేటిమాట.

శా॥ వన్నెన్ దేరినకన్నె లెందరో నిలన్ వారాంగనల్ యుండగన్
నన్నే కోరుట నీకు భావ్యమగునా నాయందు నీమోహమే
మున్నన్ లాభము లేదుగాన వినినీమూఢత్వమున్ మాని నా
కన్నన్ సుందరిగూడగా జనుము నీకామేచ్ఛలున్ దీరు గా.

శే— సఖీ యిది యేటిమాట నీసాటిగల బోటులెందైనన్ గలరా వేయేటికి

చ॥ జలనిధులింకినన్ కుసుమసాయక షణ్ముఖ దేవనాథులున్
దలపడి యుద్ధువచ్చిన సుధాంశుడు భానుడు దారిదప్పినన్
జలజభవుండు శూలియును చయ్యన నన్ విడజేయనెంచినన్
కలికిరో నిన్నువీడ నుమికామము హెచ్చెను బ్రోవవే సఖీ.

మ॥ పొలతీ నాయెడ పంతమూనతగునే పూవిల్తుడీరీతినన్
గలయన్ దాకెను నేను యేగతిని యాకందర్పు వాల్తూపులన్
గలహంబందునుద్రించుటేగతియొ, యోకాంతాననన్ బ్రోదిమా
కలహంబున్ విడజేసి సంతతము నీకారుణ్యమున్ జూపవే.

సు— చాలుచాలు సంభాషణలకుమిన్న జరుపుకొత్త నున్నయన్నట్లు విత్తముసంగనేనాపొత్తు గోరవచ్చితివాయేమి.

శే— తత్తరమొందెదవేల నీచిత్తమొచ్చినంత విత్తముఁ గొనుము.
(అని కొంత విత్తమొసంగును.)

సు— ప్రియా మీరిక సాయంకాల సమయంబునం దరుదెంచిన మీకామేచ్ఛలన్ని యథేచ్ఛఁ దీరునుగాన మీరిక నిజనివాసంబునఁ జేరి యనంతరం బరుదేర మిక్కిలి వేడుచున్నదానను.

శే— చెలీ! యట్లొనరింపఁ జెద నాకిఁక యనుజ్ఞయేనా?

సు— నాథా వెళ్ళుటయేగాదు. నవరత్నహారం బొకటి గొని రావలయు.

శే— మంచిది. (త) ఔరౌరా, ధనంబంతయు ధారబోసినను మరల నవరత్నహారంబొకటి నిమ్మనుచున్న దే. కానిమ్ము యేదైననేమి, యీనారిఁ జేరకున్న ప్రాణంబులుండునా. (ప్ర) చెలీ యిక మధ్యాహ్నముం జేరి యనంతరం బరుదెంచెద.
(నిష్క్రమించును)

సు— యిక నీ మందభాగ్యు డరుదెంచువరకు నిందు శయనించెద గాక. (అని నిష్క్రమించును)

(ప్ర): చంద్రముఖ (తనలో) ఆహా శేషగిరి సకలధనం బొసంగి నేడు రిక్తహస్తుండై యరుదెంచును కాబోలు యాతఁ డరుదెంచువరకు శీఘ్రంబున ఘోరంబగు యున్మాదౌషధరాజం బిడి యాతని ఛాందసుని గావించెదగాక. (నిష్క్రమించును.)

ప్ర: పెద్దిశెట్టి (తనలో)

పె— అయ్యబాబా యింతరాత్రియందు యాబోగంశిన్నది నాతో మాట్లాడుతుందా. కానిమ్ము యెట్లయిననేమి దానింటికెళ్ళి దాన్ని గలియాలి నామనసుతీరాలి. (నిష్క్రమించును)

ప్రవేశము: సుందరి.

(తనలో) ఆహా యీవృద్ధవైశ్యుం డెక్కడినుండి దాపరించెనో గాని మాటిమాటికి మద్గృహవాకిటనే నిలచియుండునుగదా.

ప్ర: పెద్దిశెట్టి.

పె.— ఒశేల్ సుందరి నావంక జూడవేంటే, పంచపాది

ఉ॥ కంతుకతారినన్ గనియు గావగరావది యేమిహేతువో
యింతటి మాయలాడివని యెంచకపోతిని నామనంబునం
దెంతయొగుందుచుంటి నను యేగతిగా చెదో నన్ను తాంగినా
వంత దొలంగజేయునోడ వారిజనేత్రిరో వేడుచుందుబల్
సంతసమొంద నీకిసుదు శాలువలెన్నియొ రూకలన్ సదా.

సు.— (త) ఔరా యీకుటిలవైశ్యుం డెక్కరణి నెకబాయునో గాని బ్రహ్మగ్రహమై వేధించుచున్నాడే- అబ్బా యేమి యీతని రూపము "బొగ్గుల్లో రామచిలుక" యనునట్లొప్పుచున్నాడే. నేనెన్ని మాయోపాయంబులచే నీతని వంచింపనెంచినను నిం చుకేనియు సాగదయ్యెనే- శ్రీహరీ మూఢులగు యీమనుజుల యవివేకమేమని వర్ణింపగలను కానిమ్ము. కానున్నది గాక మానునా. (ప్ర) ఆర్యా! ధనంబున్నగాని ధన్యుండవు కావుగదా వేశ్యలకు.

— ఒశేల్ యీలావినడబ్బంతా యిదివరకియ్యలేదా యేంటి.

సు.— బాగుబాగుకిన్న రేశునికన్న మిన్న యనునీవన్న మాటలన్నియు మన్నయ్యెనా యేమి, నీయట్టి ధనహీనుని జేర నామనం బొప్ప దుగాన సత్వరంబుగా నిజమందిరము జేరుకొనుము. (అని మె డబట్టి గెంటుచుండును.

పె.— నన్ను గెంటకే గెంటకే యిదిగో యీకాసులపేరుచ్చుకొని నన్ను సక్కగా శూడాలి. (కాసులపేరిచ్చును)

సు— ప్రియా నీవెంత సత్యవాక్యదురంధరుండవనియే బల్కవలయు.
పె— ఒకేల్ యీ శీరంగనీతులకేంతే సప్పున గదిలోకిపద.
సు—(త) ఆహా యితడు కోట్లకొలది ధనంబొసంగినను నించుకన్తై
న సత్క్రియలచే మెప్పించకుంటినే, నిప్పుడైన యొక తృటి
కాలమీతని స్వాంతంబునకుఁ సంతసంబు గల్గజేసెదగాక.
(ప్ర) ఆర్యా మీయాజ్ఞానుసర్తనెచరించెదగాక మీరికరండు.
(యిరువురు నిష్క్రమింతురు).

సుందరి పెద్దిశెట్టి శయ్యపై నిదురించుచుందురు.

ప్ర: చాందూఖాఁ - హుసేన్.

హు—అరేబాబు హికడ పెద్దశెట్టి హైమైకె సామార్నారే.
చా—హింక్కదాన్కి దోనుంకుమారోరె, హుసేక.
హు—ఏరండి హమారపైససబ్ లేకర్ హిపుడు హింక్కె పెటికసో
జాతెహై శేకోరే భాయి
చా—సునో హుసేఁ హికడ గడ్‌బిడ్‌కర్నానకోరెహయ్యా
హు—దీన్కి శిన్నిమూడి శూశిందిమొదలి మాకి హలాల్లరుఘల్
రుఘల్ హంటూహుండాదిరేభాయి దీన్కి మాకి వాడు సంప
లేదురే
చా—నీకీ సంపలేవురే మాంమారెగాదేఖో (అని కత్తిచే నిరువురిని
వధించును)
హు—తూబడా అచ్ఛా ఆద్మిరే లేకుంటె హింత సాహసం మాకి
దగరహైరే
చా—అరేహుసేఁ జల్ది ఘుర్కుజాయింగె చలోరె
హు—అచ్ఛాఛా (యిరువురు నిష్క్రమింతురు)

ప్ర: యిందుశర్మ - నారాయణ.

యి—మిత్రమా నారాయణ మనయనుంగు సఖులెంత విపత్తుల
పాలైరే.

నా— అయ్యా 'వినాశకాలే విపరీతబుద్ధి' యనునట్లు ధనోత్మత్తతచే నొడలెరుంగక వారనారీమణిఁ జేరువారికనిశంబీలాటి యాపదలే సంభవించుసుగాక.

యి—నాయనా, మత్పుత్రుండగు రామశాస్త్రిని కారాగారవాసునిఁ జేసి పాటిగల మేటులలోన నవకోటీశ్వరుండని బిరుదుగొన్న శేషగిరిని ఛాందసునిగావించిన యాజోటి పెద్దశెట్టితో గలసి యుండు సమయంబునందా మ్లేచ్ఛులా నిమ్మురిని గూల్చ బెరింగితివా.

నా—అయ్యా అగ్నిసాక్షిగపాణిగ్రహణంబాడిన సుందరులింటనుండ ఘోరవ్యాఘ్రస్వరూపియగు వెలకామినిఁ జేరిన నరాధముల్ పాట్లతప్పక యనుభవింతురనియే నాయభిప్రాయము.

యి—నారాయణ యీమానవులకు వారకామినిఁ జేరిన తత్ఫలం బెరిగింతమా.

నా—అయ్యా అట్లేగానిండు

యి—ఓ భారతీయులారా యిలాతలంబునఁగల వెలవెలందుల గల యగోరెడు మనుజులందరు మానభులచందంబున న్నిడుము లొందుదురుగాన మీరిక వేశ్యాపిశాచంబుల యిండ్లకుమాత్ర మేగవలదని ముమ్మాటికి ప్రార్థించుచున్నాడను.

నా—అయ్యా యికేమి కావలయును.

యి—కావలయునదేమున్నది అరణ్యంబున యిక మానాథుని సదా వేడుచు కాలముగడుపుకొందము రమ్ము.

నా—యట్లే గావింతమురండు.

(నిరువురు నిష్క్రమింతురు,)

సమాప్తః

---

# ప్రకటన.

ఆంధ్రజాతీయ గ్రంథమండలిలోఁ బ్రచురింపఁబడిన యీ క్రింది పుస్తకములు మామూలు లిపిలోనే చక్కఁగా నచ్చొత్తింపఁబడి మా యొద్ద వెలకు సిద్ధముగా నున్నవి.

సంపూర్ణప్రతులు.

| | | |
|---|---|---|
| 1 | తెనాలిరామకృష్ణకవిచరిత్ర పేజీలు 182 వెల | 0—8—0 |
| 2 | కాళిదాసు చరిత్ర పేజీలు 144 | 0—8—0 |
| 3 | శ్రీనాధకవి చరిత్ర పేజీలు 144 | 0—8—0 |
| 4 | వేములవాడ భీమకవి చరిచత్ర పేజీలు 112 | 0—8—0 |
| 5 | బమ్మెరపోతనామాత్యుని చరిత్ర పేజీలు 112 | 0—8—0 |
| 6 | భోజరాజ చరిత్ర పేజీలు 128 | 0—8—0 |
| 7 | పండితరాయ జీవితము పేజీలు 112 | 0—8—0 |
| 8 | చంద్రకళ (ఒక చిత్రమగు సాంఘికనాటకము) | 0—8—0 |
| 9 | లలిత చంద్రహాస నాటకము పేజీలు 96 | 0—8—0 |
| 10 | వైజయంతీ విలాసము నాటకము | 0—8—0 |
| 11 | కుమారీశతకము | 0—1—0 |

నూతనారోగ్యవిషయ ప్రబోధము

ఇంకను ననేకాంధ్ర గ్రంథములు గలవు.

వలయువారు,

కాళహస్త్రి సూర్యప్రకాశరావు,

అంబికా బుక్కు డిపో,

రాజమండ్రి.

అని వ్రాయవలయును.

